20–3–1992 శుక్రవారం 10 పేజీలు సంపుటి :63 సంచిక :11 విడిప్రతి : రు. 1.50 లు

Regd. No. H.N.L. 18

# జమీన్ రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు



హనుమంతు కొత్త కార్యక్రమం

## ఢిల్లీలో లంకా దహనం!

రాజ్యసభ సీటును ఎంపిక చేసినా, మాజీ పిసిసి అధ్యక్షుడు శ్రీ వి. హనుమంత రావు అలక తీరలేదు. ముఖ్యమంత్రి మీద లంకా తోక తొక్కిన రాము వలె ఎగిరి పడుతున్నారు. పాము వలె పగ బట్టి, విషం చిలక రిస్తానని శపథాలు చేస్తున్నారు. తనకు పిసిసి దక్కకపోవడానికి ప్రధాన కారణం జనార్దన రెడ్డేనని ఆయన నమ్మకం. పిసి తలచుకొని వుంటే, ఆయన అనుగ్రహానికి పాత్రుడై వుంటే ముఖ్యమంత్రి చేయగలిగింది ఏమీ లేదన్న వాస్తవాన్ని హనుమంతరావు విస్మరిస్తున్నారు. తనను ఢిల్లీకి పంపి జనార్దన రెడ్డి పెద్ద తప్పు చేశాడని, హైదరాబాదులో ఆయన తనను ఎంతగా, ఎన్ని విధాల వేధించారో, చూతను పెట్టాకే ఢిల్లీలో ఆయన్ను అంతకు రెట్టింపుగా ఇబ్బంది పెడతానని హనుమంతరావు కన్పడిన వారందరికీ చెప్తున్నారట. ఈ న్యూసెన్స్ సృష్టి కార్యంలో మొదటి అధ్యాయం ఢిల్లీలోని ఆంధ్రభవన్‌లో మొదలైంది.

రాష్ట్రం నుంచి పార్లమెంటుకు ఎంపికైన సభ్యులకు, స్వంత క్వార్టర్లు కేటాయింపు అయ్యే వరకు ఆంధ్ర భవన్‌లో వసతి కల్పించడం సాంప్రదాయం. అట్లే హనుమంత రావుకూ అందరికీ ఇచ్చినట్లే సాధారణ గది అలాట్ చేశారు. కాని తనకు స్పెషల్ సూట్ కావాలని ఆయన డిమాండ్ చేశారట. అక్కడి సిబ్బంది ఒప్పుకోలేదు. అంతే వారందరి పై మండి పడి, ఆగం చేసి, తాను కోరిన స్పెషల్ సూట్ తాళాలు బలవంతంగా పగులగొట్టి, లోపల మకాం

కొరవ / పేజీలో



ప్రఖ్యాత ఆర్కిటెక్ట్ గోవిందరావు తయారు చేసిన తిరుపతి ఎ.ఐ.సి.సి. సమావేశ సమగ్ర రూపాన్ని నిశితంగా పరిశీలిస్తున్న ముఖ్యమంత్రి జనార్దన రెడ్డి, వివరిస్తున్న ఎమ్మెల్యే మాగుంట సుబ్బరామి రెడ్డి. మధ్యలో పద్మనాభరెడ్డి.

### ఎఐసిసి ఖర్చు 10 కోట్లు

తిరుపతిలో ఎఐసిసి ప్లీనరీ సమావేశాల కోసం జరుగుతున్న ఏర్పాట్లు నభూతో, నభవిష్యతి అన్నట్లున్నాయంటున్నారు. కాంగ్రెస్ చరిత్ర పుటలలో ఈ సమావేశాలకు శాశ్వత స్థానం దొరకనున్నదని

## ఎవరి చమురు వదులుతుందో ?

పరిశీలకుల అభిప్రాయం.

ముఖ్యమంత్రి జనార్దన రెడ్డి, మాగుంట సుబ్బరామి రెడ్డిల సంయుక్త కృషితో వీటికి ఘనత దొరుకుతున్నది. సమావేశ స్థలం ఎంపికతోనే వీటికి ఎక్కడ లేని గాంభీర్యత సమకూరింది. 180 ఎకరాల సువిశాల ప్రదేశంలో నిర్మించబోతున్న వేదికలు, పందిళ్ళు, స్వాగత తోరణాలు, భోజన ఏర్పాట్లు ఆశ్చర్యపు గొల్పే రీతిలో వున్నాయి. సినీ కళాకారుడు శ్రీ తోట తరణి నిర్మిస్తున్న స్వాగత తోరణం ఒక్కటే 25 లక్షలవుతున్నదట. సమావేశం జరిగే పందిరి, అందులోని వేదికకు ఖర్చు 75 లక్షలు. ఎస్‌టిడి సౌకర్యం వున్న 50 టెలిఫోన్లు ఆ ప్రాంగణంలో పెడుతున్నారు. దాదాపు 1500 మంది దేశ విదేశీ పత్రికా విలేకరులు, వీడియో గ్రాఫర్లు, కెమెరామెన్లు హాజరౌతున్నారు. వీరి కోసం మరొక

కొరవ / పేజీలో

